# తత్త్వ గాన సుధ

(1) ఏమి జన్మము? ఏమి జీవనము?

నిలువెల్ల బ్రతుకు కాలిపోవుట దేని కోసము?

ఎవరి కెవరో ఎరుక లేదు ఏది ఎపుడో తెలిసిరాదు

మనసు చెడితే బాగుపడదు వయసు పోతే తిరిగి రాదు

ఏమి జన్మము? ఏమి జీవనము?

నిలువెల్ల బ్రతుకు కాలిపోవుట దేని కోసము?

(2) మట్టికుండ మలిన దేహము

పుట్టి చచ్చి చచ్చి పుట్టి ఏమి లాభము?

ఉండ దెపుడూ మట్టికుండ కాలగతిలో పగలకుండా

దేహముండదు కాలకుండా దేహి ఉండును చెదరకుండా

మట్టికుండ మలిన దేహము

పుట్టి చచ్చి చచ్చి పుట్టి ఏమి లాభము?

(3) తోడు ఎవరు? ఎవరికి తోడు?

నిజము తెలిసిన తోడు ఎవడూ కోరుకోడు

తారలెన్నో ఆకసమున తోడు నిలిచి అంబరానికి

తెల్లవారితే జాడలుండవు గోడులే ఈ తోడులన్నీ

తోడు ఎవరు? ఎవరికి తోడు?

నిజము తెలిసిన తోడు ఎవడూ కోరుకోడు

(4) ఎవరు బాధలు లేనివారు

కన్నీటి జగతిలో బాధ లెవరూ దాటలేరు

బాధలను తొలగించు శక్తి ఎవరి కున్నది ధరణి లోన?

దైవ మందు మనసు పడితే బాధలన్నీ కరిగిపోవు

ఎవరు బాధలు లేనివారు

కన్నీటి జగతిలో బాధ లెవరూ దాటలేరు

(5) నిలువ దెంతో కాలము ప్రాణం

దేహ ఒడిలో కారిపోవును క్షణములో జీవం

కారిపోవు మేఘజలము కురిసి కురిసి క్షణము క్షణము

రాలిపోవు మాయ దేహము

ఎప్పుడైనా ఎక్కడైనా నిలువ దెంతో కాలము ప్రాణం

దేహ ఒడిలో కారిపోవును క్షణములో జీవం

(6) తనువు నీవని మోసపోవద్దు

అది ఎంత కులికినా వల్లకాటిలో కాలి బూది యగు

గాలి పీల్చిన దేహ ముండును గాలి పోయిన కుప్పకూలును

చితిలో చర్మము చితికి పోవును

కనుల ముందే మాయ మగును తనువు నీవని మోసపోవద్దు

అది ఎంత కులికినా వల్లకాటిలో కాలి బూది యగు

(7)పెంచుకొనిన సిరులు సంపదలు

పంచ చేరి ముంచి తీరును మోహమును పెంచి

తృప్తి నివ్వని సిరులు ఎందుకు?

లేని సిరులకు దిగులు చెందకు ఉన్నదానితో తృప్తి చెందితే

కలుగు సుఖము తొలగు శోకము పెంచుకొనిన సిరులు

సంపదలు పంచ చేరి ముంచి తీరును మోహమును పెంచి

(8) తెలియకుంటే బ్రతుకు శాపము

తెలివి ఉంటే క్షణము క్షణము దివ్య జీవనము

బ్రహ్మ నీవని బోధ చేయుచు వెలుగు చున్నవి వేదవాక్కులు

మనసు పెట్టి మర్మ మెరిగితే

మాయతొలగును మహిమ తెలియును

తెలియకుంటే బ్రతుకు శాపము

తెలివి ఉంటే క్షణము క్షణము దివ్య జీవనము

(9) ఉన్న దెవరు? లేని వారెవరు?

ఎంచి చూచిన లేనివారే ఉందు రిలలోన

ఎంత ఉన్నా తనివి తీరదు ఏది ఉన్నా తనువు నిలవదు

లేని వారికి లేని దేమిటి?

ఉన్న వారికి ఉన్న దేమిటి? ఉన్న దెవరు? లేని వారెవరు?

ఎంచి చూచిన లేనివారే ఉందు రిలలోన

(10) ఆశ పాశము ఘోర శాపము

ఎంత ఉన్నా తుది ఎరుగదు తీర దెన్నడు

చాలు అనుకొని మేలు తెలిసి పరుల హితమును మదిని

తలచి ధర్మ నీడన నడచు వారికి

ప్రాప్తి పరము జన్మవరము

ఆశ పాశము ఘోర శాపము

ఎంత ఉన్నా తుది ఎరుగదు తీర దెన్నడు

(11) భేద భావము బాధరూపము

విశ్వమంతా విశ్వనాథుని దివ్య మందిరము

అలను చూడకు కడలి చూడు అంతరించును అంతరములు

నామరూపము కాదు సత్యము అంతరంగము ఆత్మమయము

భేద భావము బాధరూపము

విశ్వమంతా విశ్వనాథుని దివ్య మందిరము

(12) ఏవి మమతలు? ఏవి మధురములు?

సరిపడని కొలతలు ఎంత వెదకిన ఎండమావులు

ఎదురు చూచిన ఎదలు పగులును

ఎదురు తిరిగిన దిగులు మిగులును

వగల వెనుక పగలు దాగును వెలుగు లారి చీకటగును

ఏవి మమతలు? ఏవి మధురములు?

సరిపడని కొలతలు ఎంత వెదకిన ఎండమావులు

(13) మనసు చపలము బ్రతుకు చంచలము

ఉన్న సమయము ఆకసమున మెరపు చందము

నిన్న ఉన్నది నేడు లేదు నేడు ఉన్నది రేపు రాదు

నాశమగును రూపులన్నీనిలిచి వెలుగు స్వరూప మొకటే

మనసు చపలము బ్రతుకు చంచలము

ఉన్న సమయము ఆకసమున మెరపు చందము

(14) సాధు స్నేహము జన్మ సార్థకము

వినియోగ పడితే భక్తి సులభము ముక్తి సాధకము

హితము చేయును సాధు సన్నిధి

సర్వ జనులకు దివ్య పెన్నిధి క్షయము లేనిది క్షేమమైనది

మోక్షప్రాప్తికి మార్గ మైనది. సాధు స్నేహము జన్మ సార్థకము

వినియోగ పడితే భక్తి సులభము ముక్తి సాధకము

(15) జీవు డెవరు? దేవుడు ఎవరు?

వారి నైజము తెలిసి నపుడే తొలగు బంధము

ఊగులాడే వాడె జీవుడు ఊరకుంటే దేవుడతడు

తనను మరచిన జీవుడగును తనను ఎరిగిన దేవు డగును

జీవు డెవరు? దేవుడు ఎవరు?

వారి నైజము తెలిసి నపుడే తొలగు బంధము

(16) ఎవరు మిత్రులు? ఎవరు ఆప్తులు?

సదా మనతో కలసి మెలసి మెలుగు వారెవరు?

ఎన్నడూ విడిపోని వాడు సదా మనతో ఉండువాడు

ఈశుడే కాపాడువాడు నిత్యుడతడే మిత్రుడతడే

ఎవరు మిత్రులు? ఎవరు ఆప్తులు?

సదా మనతో కలసి మెలసి మెలుగు వారెవరు?

(17) మరచిపోనీ మనసు నేదైనా

మరువరానిది ధర్మ మొకటే ధరణి లోన

ధర్మముగ జీవించు వానిని అనుసరించును దైవ మెపుడు

దైవ మెవరిని కనికరించునో వాడే దైవము విశ్వమునకు

మరచిపోనీ మనసు నేడైనా

మరువరానిది ధర్మ మొకటే ధరణి లోన

(18) భక్తియే బ్రతుకు చుక్కాని

జీవి యాత్రలో గురుదేవుడే మార్గగామి

బాగు చేయును భక్తి ఒకటే బ్రతుకు భవ్యము జీవి ధన్యము

భక్తి లేే జీవి బ్రతుకు నీరు లేని బావి రీతి

భక్తియే బ్రతుకు చుక్కాని

జీవి యాత్రలో గురుదేవుడే మార్గగామి

(19) ఏది నీది? ఎక్కడిది నీకు?

ఏ విభవమైనా సత్యదేవుని నిత్య వైభవము

దర్పముండదు సత్య మెరిగిన

వినయ మొప్పును నిజము తెలిసిన

ఏ తేజము ఎవరిదైనా దైవ మహిమే అందులోన

ఏది నీది? ఎక్కడిది నీకు?

ఏ విభవమైనా సత్యదేవుని నిత్య వైభవము

(20) ఉన్న వెపుడూ బాధించవు

మనిషి మదిలో ఉన్నవే వేధించును

ఏది ఉన్నా లేదు నష్టము మదిలో ఉంటే లేదు లాభము

రాగద్వేషము లంతరించిన ఏది ఉన్నా సుఖము చెడదు

ఉన్న వెపుడూ బాధించవు మనిషి మదిలో ఉన్నవే వేధించును

(21) గీత తెలిసిన బ్రతుకు అమృతము

తెలియకుంటే అంత మగును వింతజీవితము

గీత తుడుచును నొసటి వ్రాత గీత దింపును బ్రతుకు మోత

గీత నెపుడూ విడిచిపెట్టకు ముక్తి నొసగును కృష్ణగీత

గీత తెలిసిన బ్రతుకు అమృతము తెలియకుంటే

అంత మగును వింత జీవితము

(22) కర్మలెపుడూ బంధించవు

వాస్తవానికి కర్మఫలములు బాధించవు

కామ్య మెరుగని కర్మజాతము కోరలుడిగిన పాము పగిది

అలల లోలె కలల వోలె కరిగి పోవును కనుల ముందే

కర్మ లెపుడూ బంధించవు

వాస్తవానికి కర్మఫలములు బాధించవు